రా12. 37 (1కే 7రా 4రవి) వివాహ గృహారంభ ప్రవేశాదులకు కుంభోమతాంరహి రా2. 53 మీనోపిరహి తె3. 34 (8చంద్రగురుః)

30 సోమ పూర్ణిమ తత్కాల పాడ్యమి స్వాతి మిథునంరహి ప10. 19 (కు, శదృ, 8కే గు,దృ) గృహారంభ వైశ్యోపనయన క్రయవిక్రయా దీనాం ప11. 17 (దుస్పర్శ కుదృ) సింహోరహి ప2. 27

**మే1** మంగ పాడ్యమి తత్కాల విదియ అనూరాధ గృహారంభదీనాం మకరంచోర రా12. 29 వివాహ గృహారంభ ప్రవేశాదులకు కుంభోరహి రా2. 45 (బల)

2 బుధ విదియ తత్కాల తదియ అనూరాధ సాధారణ వ్యవహారా దీనాం మిథునంరహి ఉ10. 12 (7కు. శ, గు. దృ) డోలారోహణ క్రయవిక్రయాదీనాం సింహోరహి ప2. 19

3 గురు తదియ తత్కాల చవితి మూల వివాహ గృహప్రవేశాదీనాం వృశ్చికోరహి రా8. 29 (శుభాంశ) వివాహ గృహప్రవేశ, ఆరంభా దీనాం కుంభోమతాంరహి రా2. 37 మీనోపిరహి తె3. 19

4 శుక్ర చవితి తత్కాల పంచమి మూల డోలారోహణ క్రయవిక్రయా దీనాం సింహోరపి ప2. 11 (దుస్పర్శ) వివాహాదీనాం వృశ్చికో మతాంరహి రా7. 34 (వస్పర్శ) బోరింగ్ పూర్వాషాఢకు కుంభో రహి రా2. 33 మీనోమతాంరహి తె3. 15

★ చిన్నకర్తరి ప్రారంభం (గృహారంభ ప్రవేశాదులు ఇచ్చాము కాని ఆచారరీత్యా వినియోగించుకోవలెను.)

5 శని పంచమి తత్కాల షష్ఠి ఉత్తరాషాఢ గృహారంభ ప్రవేశ వివాహా దీనాం కుంభోరహి రా2. 29 మీనోపిరాజ తె3. 11

6 ఆది షష్ఠి ఉత్తరాషాఢ డోలారోహణ క్రయవిక్రయాదీనాం సింహం చోరః ప2. 03 తత్కాల సప్తమి వివాహాదీనాం వృశ్చికోమతాంరహి రా7. 27 వివాహ గృహారంభ ప్రవేశాదులకు కుంభోరహి రా2. 25 (12 చంద్రః) మీనోపిమతాంరహి తె3. 07

7 సోమ సప్తమి శ్రవణం వైశ్యోపనయన క్రయవిక్రయాదీనాం వృషభోచోరః ఉ7. 01 (8 శని) గృహప్రవేశాదులకు కుంభోవసుః రా2. 21 మీనోపిరహి తె3. 03

8 మంగళ అష్టమి తత్కాల నవమి ధనిష్ఠ గృహారంభ ప్రవేశ వివాహా దీనాం మీనోరహి తె2.59 (12 చంద్రః)

9 బుధ నవమి తత్కాల దశమి శతభిషం వివాహ గృహప్రవేశాదీనాం కుంభోరహి రా2.14 (1 చంద్రః) మీనోపిమతాంరహి రా2.55 (12 చంద్రః)

10 గురు దశమి శతభిషం వివాహ గృహారంభ ప్రవేశాదీనాం వృషభో రహి ఉ6.48

11 శుక్ర ఏకాదశి పూర్వాభాద్ర ఆశ్వలాయన ఉపనయనాదీనాం వృషభోమతాంరహి ఉ6.44 ఉత్తరాభాద్ర వివాహాదీనాం వృశ్చికోరపి రా7.07 (8 శనిః)

★ పెద్ద కర్తరి ప్రారంభం

## అధికజ్యేష్ఠమాసము (16-5-2018 -13-6-2018)

**ఈ మాసములో ముహూర్తములు లేవు.**

## నిజజ్యేష్ఠమాసము (14-6-2018 -13-7-2018)

**జూన్15** శుక్ర తత్కాల తదియ పునర్వసు గర్భాదాన గృహప్రవేశం కుంభోరహి రా11.48 (వస్పర్శ) మీనోపిమతాంరహి రా12.30 గృహప్రవేశాదీనాం మేషోరహి తె2.56 వృషభోపిరాజ తె4.27

16 శని తదియ పుష్యమి అన్నప్రాశన అక్షరస్వీకార క్రయవిక్రయ ఉపనయనాదీనాం సింహోరహి ప11.22 చవితి పుష్యమి వివాహా దీనాం కుంభోరహి రా11.44

18 సోమ పంచమి తత్కాల షష్ఠి అన్నప్రాశన క్రయవిక్రయాదీనాం సింహోరహి ఉ11.14 ఉపనయన, గృహారంభ, ప్రవేశ (ల.చం) మీనంరహి రా12.18 (8 గురుః)

19 మంగ షష్ఠి తత్కాల సప్తమి ఉత్తర వివాహ గృహారంభ ప్రవేశాదీనం మీనంరహి రా12.14 (8 గురుః)

20 బుధ అష్టమి ఉత్తర డోలారోహణ క్రయవ్రికయ వైశ్యోపనయనా దీనాం సింహోమతాం రహి ఉ11.10 హస్త గృహారంభ ప్రవేశ వివాహాదీనాం వృషభోమతాంరహి తె.4.05 (8 శని)

21 గురు నవమి చిత్త వివాహ గృహారంభ ప్రవేశాదులకు మేషోరహి రా2.34 (6 చంద్రః) దశమి చిత్త వివాహ గృహారంభ ప్రవేశాదు లకు వృషభోరహి తె3.59

22 శుక్ర దశమి చిత్త డోలారోహణ క్రయవిక్రయాదీనాం సింహో మతాంరహి 11.29 (శుభాంశ) (వస్పర్శ) స్వాతి వివాహాదీనాం మేషోచోరః రా2.28 (7 చంద్రః) వృషభోపిరహి తె3.55

23 శని ఏకాదశి స్వాతి డోలారోహణ క్రయవిక్రయాదీనాం సింహో మతాంరహి ఉ10.55 (వస్పర్శ) మీనంరహి రా11.58

25 సోమ త్రయోదశి అనూరాధ గృహప్రవేశాదీనాం కుంభోరహి రా11.09

27 బుధ చతుర్ధశి తత్కాల పూర్ణిమ మూల అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార వివాహ గృహారంభ ప్రవేశాదీనాం సింహోరహి ఉ10.39 వివాహ ప్రవేశం మీనోరహి రా11.42 మేషోపిరహి రా2.08 వృషభో మతాంరహి రా3.36

29 శుక్ర పాడ్యమి తత్కాల విదియ ఉత్తరాషాఢ వివాహ గృహప్రవేశా దీనాం మీనోరహి రా11.34 (వస్పర్శ) వృషభోమతాం తె3.28 (సగ్రచం)

30 శని బహుళ విదియ ఉత్తరాషాఢ క్రయవిక్రయాదీనాం సింహో రహి ఉ10.27 తత్కాల తదియ శ్రవణం ప్రవేశాదీనాం మేషోరహి రా1.57 (వస్పర్శ)

**జూలై1** ఆది తదియ శ్రవణం క్రయవిక్రయ అన్నప్రాశన ఉపనయనా దీనాం సింహోరాజ ఉ10.23 (సగ్రచం) చవితి ధనిష్ఠ ప్రవేశా దీనాం మీనోరాజ రా.11.27 మేషోపిచోరః రా1.53

2 సోమ చవితి ధనిష్ఠ క్రయవిక్రయ అన్నప్రాశనాదీనాం సింహోరహి ఉ10.19 ఉపనయన ప్రవేశాదీనాం మీనోమతాంరహి రా11.23

3 మంగ పంచమి తత్కాల షష్ఠి శతభిషం వివాహ గృహారంభాదీనాం మేషోవసుః రా1.45

5 గురు సప్తమి ఉత్తరాభాద్ర వివాహ గృహప్రవేశాదీనాం కుంభోరాజ రా10.27 అష్టమి మేషోపిరహి రా1.37 వృషభోపిచోరః తె3.04

6 శుక్ర అష్టమి రేవతి అన్నప్రాశ అక్షర స్వీకార క్రయవిక్రయాదీనాం సింహోమతాంరహి ఉ10.04 (8 చంద్ర) వివాహ గృహప్రవేశా దీనాం కుంభోరహి రా10.23 ఆరంభప్రవేశాదీనాం మేషవసుః రా1.33 వృషభోరహి తె3.01

7 శని నవమి అశ్వని క్రయవిక్రయాదీనాం అన్నప్రాశన సింహోరాజ ఉ10.01 దశమి వివాహ గృహారంభాదీనాం మేషోరాజ 1.29 (లచం) వృషభోరహి రా2.58 (వస్పర్శ)

## ఆషాఢమాసము (13-7-2018 -11-8-2018)

**జూలై16** సోమ చవితి మఖ అన్నప్రాశనాదులకు సింహోరహి ఉ9.24

18 బుధ షష్ఠి హస్త అన్నప్రాశనాదులకు కన్యారహి ఉ10.52

19 గురు సప్తమి చిత్త అన్నప్రాశనాదీనాం సింహోరాజ ఉ9.12

23 సోమ ఏకాదశి అనూరాధ క్రయవిక్రయాదీనాం సింహోవసుః ఉ8.57 అన్నప్రాశన కన్యారహి ఉ10.32

25 బుధ త్రయోదశి మూల అన్నప్రాశనాదీనాం సింహోరహి ఉ 8.49 కన్యాపిమతాం ఉ10.24

28 శని బహుళ పాడ్యమి శ్రవణం అన్నప్రాశన క్రయవిక్రయాదీనాం కన్యారహి ఉ10.13

30 సోమ విదియ తత్కాల తదియ శతభిషం అన్నప్రాశనాదీనాం కన్యారహి ఉ10.05

**ఆగ2**గురు పంచమి ఉత్తరాభాద్ర అన్నప్రాశన క్రయవిక్రయాదీనాం సింహోరహి ఉ8.13

## శ్రావణమాసము (12-8-2018 -9-9-2018)

12 ఆది శుద్ధ పాడ్యమి తత్కాల విదియ మఖ వివాహ గర్భాదాన ప్రవేశం మీనోరహి రా8.41

13 సోమ విదియ తత్కాల తదియ ఉత్తర గృహప్రవేశాదీనాం మీనో మతాంరహి రా8.39

15 బుధ పంచమి హస్త అన్నప్రాశాదీనాం సింహోరహి ఉ7.26 కుంభంచోరః రా7.48 వివాహాదీనాం మీనంరహి రా8.30

16 గురు షష్ఠి చిత్త అన్నప్రాశన వైశ్యోపనయన గృహారంభ ప్రవేశాదీనాం సింహోరహి ఉ7.22 కన్యాపిరాజ ఉ8.58 క్రయవిక్రయ సాధారణ కార్యాదీనాం తులారహి ఉ11.48 స్వాతి కుంభో మతాంరహి రా7.44

17 శుక్ర సప్తమి స్వాతి సాధారణ కార్యాదీనాం తులావసుః ప11.44 (సంక్రమణం)

18 శని అష్టమి అనూరాధ మీనోవసుః రా8.18

19 ఆది నవమి అనూరాధ అన్నప్రాశనో గృహారంభ ప్రవేశాదీనాం కన్యాచోరః ఉ8.46 తులాపిరహి ఉ11.36

23 గురు ద్వాదశి ఉత్తరాషాఢ క్రయవిక్రయాదీనాం కన్యావసుః ఉ 8.31 త్రయోదశి వివాహగృహప్రవేశాదీనాం మీనోంచోరః రా7.58 వృషభోపిరహి రా11.52

24 శుక్ర త్రయోదశి శ్రవణం అన్నప్రాశన క్రయవిక్రయాదీనాం తులా రహి ఉ9.40 (వర్గోత్తమాంశ) వివాహ, గృహప్రవేశాదులకు మీనంరహి రా7.54 వృషభోపి మతాంరహి రా11.48

25 శని చతుర్ధశి ధనిష్ఠ క్రయవిక్రయాదీనాం తులాచోరః ప1.13 పౌర్ణమి వివాహ గృహప్రవేశాదీనాం మీనోరహి రా7.51 వృషభోపి మతాంరహి రా11.44

26 ఆది పూర్ణిమ ధనిష్ఠ అన్నప్రాశన క్రయవిక్రయాదీనాం కన్యారహి ఉ8.19 తులమతాంరహి ఉ11.09 పాడ్యమి శతభిషం వృషభో మతాంరహి రా11.40

27 సోమ బహుళ పాడ్యమి శతభిషం అన్నప్రాశన క్రయవిక్రయాదీనాం కన్యామతాంరహి ఉ8.15 తులాపిరహి ప11.05

29 బుధ తదియ ఉత్తరాభాద్ర అన్నప్రాశన క్రయవిక్రయాదీనాం కన్యారహి ఉ8.15 తులాపి మతాంరహి ఉ10.57 మీనోమతాం రహి రా7.35

30 గురు చవితి రేవతి వివాహాదీనాం మీనోరహి రా7.31 పంచమి అశ్విని వివాహాదీనాం వృషభోమతాంరహి రా11.24 (ప్రవేశాదీనాం)

31 శుక్ర పంచమి అశ్విని వివాహాదీనాం మీనోమతాంరహి రా7.25

**సెప్టె2** ఆది సప్తమి రోహిణి వివాహాదీనాం మేషోరపి రా9.45

3 సోమ అష్టమి రోహిణి అన్నప్రాశన క్రయవిక్రయాదీనాం తులా రహి ఉ10.37 వివాహాదీనాం మీనోవసుః రా7.15 మృగశిర నవమి వివాహాదీనాం మేషోమతాం రా9.41

5 బుధ దశమి తత్కాల ఏకాదశి పునర్వసు మేషంరహి రా9.35

6 గురు ఏకాదశి పునర్వసు క్రయవిక్రయాదీనాం కన్యామతాం ఉ7.35

## భాద్రపదమాసము (10-9-2018 -9-10-2018)

**సెప్టె12** శుద్ధ బుధ తదియ చిత్త రిజిస్ట్రేషన్, అన్నప్రాశనాదులకు రహి కన్యాలగ్నం ఉ7.12

13 గురు చవితి స్వాతి అన్నప్రాశన సాధారణ కార్యములకు రహి తులాలగ్నం ఉ9.58 వృశ్చికచోర ఉ10.55

17 సోమ అష్టమి మూల సాధారణ కార్యములకు రహి తులాగ్నం ఉ9.50

22 శని త్రయోదశి ధనిష్ఠ అన్నప్రాశన, రిజిస్ట్రేషన్, సాధారణ కార్యక్రమములకు రహి తుల ఉ9.23 వృశ్చికచోర ఉ10.20

24 మహాలయపక్ష ప్రారంభం

## ఆశ్వీయుజమాసము (10-10-2018 -7-11-2018)

**అక్టో10** శుద్ధ పాడ్యమి చిత్త కలశస్థాపన తులారాజ ఉ8.11 గృహప్రవేశాదులకు మేషంరహి 7.18 (7 చంద్ర)

11 గురు విదియ తత్కాల తదియ స్వాతి వివాహాది గృహారంభ ప్రవేశాదులకు తుల ఉ8.08 (ల చంద్రః)

12 చవితి అనూరాధ వివాహ, శంఖుస్థాపన గృహప్రవేశాదులకు సింహచోరః తె3.34

13 శని పంచమి అనూరాధ వివాహాది గృహప్రవేశాదులకు వృశ్చిక మతాం ఉ8.58 (ల చంద్రః)

14 ఆది షష్ఠి మూల వివాహాది గృహప్రవేశాదులకు వృషభమతాంరహి రా8.27 సింహంరహి తె3.26

17 బుధ అష్టమి ఉత్తరాషాఢ అక్షరస్వీకారం శంఖుస్థాపన గృహ ప్రవేశం తులారాజ 7.44 వృశ్చిక.ర ఉ8.42 నవమి గృహప్రవేశ గర్భాదాన వివాహ వృషభం రా8.15 (8 శని)

19 దశమి ధనిష్ఠదశమిత్యేవ విజయముహూర్తః ప1.59

21 **శుక్రమౌఢ్యమి ప్రారంభం**

22 సోమ త్రయోదశి ఉత్తరాభాద్ర అన్నప్రాశనాదీనాం వృశ్చికోరాజ ఉ8.21

24 బుధ పూర్ణిమ రేవతి అన్నప్రాశన క్రయవిక్రయాదీనాం వృశ్చికోరహి ఉ8.13

28 ఆది చవితి మృగశిర అన్నప్రాశన వ్యవహారాదీనాం వృశ్చికోరహి ఉ7.57

31 బుధ సప్తమి పుష్యమి అన్నప్రాశనాదీనాం వృశ్చికోరహి ఉ7.45

**నవ2** శుక్ర నవమి తత్కాల దశమి మఖ అన్నప్రాశనాదీనాం వృశ్చికోరహి ఉ7.38

9 శుక్ర విదియ అనూరాధ అన్నప్రాశనాదీనాం వృశ్చికోరహి ఉ7.38

## కార్తీకమాసము (8-11-2018 -7-12-2018)

**నవ9** శుక్ర విదియ అనూరాధ అన్నప్రాశనాదీనాం వృశ్చికో మతాంరహి ఉ7.09

14 బుధ సప్తమి శ్రవణం అన్నప్రాశాదీనాం వృశ్చికోరహి ఉ6.52

15 గురు సప్తమి శ్రవణం అన్నప్రాశన వ్యవహారాదీనాం వృశ్చికోమతాంరహి ఉ6.48

19 సోమ ఏకాదశి ఉత్తరాభాద్ర అన్నప్రాశనాదీనాం మకరోరాజ ఉ 11.13 (1కే 7రా)

**డిశ2** ఆది దశమి హస్త అన్నప్రాశనాదీనాం మకరోరహి ఉ10.21

## మార్గశిరమాసము (8-12-2018 -6-1-2019)

**డిసె12** బుధ పంచమి శ్రవణం అన్నప్రాశనాదీనాం మకరోరహి ఉ 9.44 (1కే 7రా లచం) ధనిష్ఠ వివాహ గృహారంభ గృహప్రవేశ తులారహి తె4.01

13 గురు షష్ఠి శతభిషం వివాహాదీనాం కన్యాచోరః రా1.06

15 శని అష్టమి ఉత్తరాభాద్ర వివాహ గృహారంభ ప్రవేశాదీనాం తులామతాంరహి తె3.48

16 ఆది నవమి రేవతి వివాహాదీనాం తులారహి తె3.44

18 మంగళ దశమి తత్కాల ఏకాదశి అశ్విని వివాహాదీనాం తులారహి తె3.37 (7 చంద్రః) (వస్పర్శ)

23 ఆది బహుళ పాడ్యమి తత్కాల విదియ పునర్వసు గృహారంభం తులమతాంరహి తె3.18

26 బుధ చవితి తత్కాల పంచమి మఖ వివాహాదీనాం కర్కాటకోరహి రా7.29 (1రా 7కే) తులాపి తె3.06 (బల)

28 శుక్ర సప్తమి ఉత్తర వివాహ గృహప్రవేశాదీనాం తులామతాంరహి రా2.57 గృహారంభ

29 శని అష్టమి తత్కాల నవమి హస్త గృహారంభ వివాహాదులకు తులారహి తె.2.57 (12 చంద్రః)

30 ఆది నవమి చిత్త అన్నప్రాసనాదీనాం మకరోరహి ఉ8.34 (సూత్ర సంధి) వివాహాదీనాం కర్కాటకామతాంరహి రా 7.14 (1రా 7కే) వివాహాదీనాం తులామతాంరహి రా2.49 (ల చం)

31 సోమ దశమి తత్కాల ఏకాదశి స్వాతి గృహారంభాదులకు తులా రహి రా2.45 (ల చం)

## పుష్యమాసము (7-1-2019 -4-2-2019)

**జన9** బుధ తదియ ధనిష్ఠ అన్నప్రాసనాదీనాం మకరోమతాంరహి ఉ7.54 కుంభోపిరహి ఉ10.10

10 గురు చవితి శతభిషం మకరోవసు ఉ7.50 కుంభోరహి ఉ 10.06 (దు స్పర్శ)

12 శని షష్ఠి ఉత్తరాభాద్ర అన్నప్రాశదీనాం కుంభోరహి ఉ9.59

13 ఆది సప్తమి ఉత్తరాభాద్ర అన్నప్రాశనస్య వ్యవహారాదీనాం కుంభో రహి ఉ9.55

14 సోమ అష్టమి రేవతి అన్నప్రాశన సాధారణ వ్యవహారాదీనాం కుంభోరహి ఉ9.51

18 శుక్ర ద్వాదశి రోహిణి అన్నప్రాశనాదీనాం కుంభోచోరః ఉ9.36

19 శని త్రయోదశి మృగశిర అన్నప్రాశనాదీనాం కుంభోరహి ఉ9.32

21 సోమ పూర్ణిమ పుష్యమి అన్నప్రాశనాదీనాం కుంభోరహి ఉ9.23

27 ఆది సప్తమి చిత్త కుంభచోరః ఉ9.01

28 సోమ అష్టమి స్వాతి కుంభోరహి ఉ8.57
30 బుధ దశమి అనూరాధ కుంభంచోరః ఉ8.48

## మాఘమాసము (5-2-2019 -6-3-2019)

**ఫిబ్ర6** విదియ ధనిష్ఠ అన్నప్రాశన ఉపనయన అక్షరస్వీకారములకు కుంభోమతాంరహి ఉ8.20 (లగ్న చంద్రః) శతభిషం మీనోపి చోరః శుభాశనిర్ణేత 10-13 వివాహ గృహారంభ ప్రవేశాదులకు వృశ్చికోరహి రా1.18

7 గురు విదియ తత్కాల తదియ శతభిషం అన్నప్రాశనోపనయన అక్షరస్వీకారములకు కుంభోరహి ఉ8.16 మీనోపి మతాంరహి ఉ8.58 (దేవతా ప్రతిష్ఠ)

8 శుక్ర తదియ తత్కాల చవితి ఉత్తరాభాద్ర వివాహ గృహప్రవేశ గృహారంభాదీనాం వృశ్చికోరహి రా1.10 (వస్పర్ష)

9 శని చవితి ఉత్తరాభాద్ర అన్నప్రాశన అక్షరసీవకార (ఉపనయన శీఘ్ర) గృహప్రవేశాదీనాం మీనోరాజ ఉ8.50 వివాహ గృహారంభ ప్రవేశాదీనాం వృశ్చికోరహి రా1.08

10 ఆది పంచమి రేవతి అన్నప్రాశన అక్షరస్వీకార ఉపనయన గృహారంభ ప్రవేశాదులకు మీనోరహి ఉ8.46 (దేవతా ప్రతిష్ఠ) అశ్విని షష్ఠి వివాహ గర్భాదాన గృహప్రవేశం కన్యామతాంరహి రా8.01 (న సంధి) వృశ్చికోపిరహి రా1.02 (6 చంద్రః)

11 సోమ షష్ఠి అశ్విని అన్నప్రాశన గృహారంభ ప్రవేశాదీనాం కుంభో మతాంరహి ఉ8.07 ప్రతిష్ఠా గృహారంభాదీనాం మీనోరహి ఉ8.42

13 బుధ అష్టమి తత్కాల నవమి రోహిణి వివాహాదీనాం వృశ్చికోరహి రా12.51 (7 చంద్రః) ఉ8.50కి సంక్రమణ)

14 గురు నవమి రోహిణి అన్నప్రాశన గృహారంభ ప్రవేశ వివాహా దీనాం మీనోమతాంరహి ఉ8.36

15 శుక్ర దశమి మృగశిర అన్నప్రాశన గృహారంభ ప్రవేశాదీనాం మీనోమతాంరహి ఉ8.26 (దుస్పర్శ)

17 ఆది ద్వాదశి తత్కాల త్రయోదశి పునర్వసు అన్నప్రాశన గృహారం భాదీనాం మీనచోరః ఉ8.18

18 సోమ చతుర్థశి పుష్యమి అన్నప్రాశన గృహారంభ ప్రవేశాదీనాం మీనోరహి ఉ8.14

21 గురు విదియ ఉత్తర అన్నప్రాశన అక్షరస్వీకార ఉపయనాదీనాం మీనోరాజ ఉ8.03 (6 చంద్రః)

22 శుక్ర తదియ హస్త అన్నప్రాశన ఉపనయన పణ్య గృహారంభా దీనాం మీనోరహి ఉ7.59 (దుస్పర్శ) చవితి చిత్త వివాహ గృహారంభ ప్రవేశాదీనాం వృశ్చికంచోరః రా106 (శుభాంశ)

23 శని చవితి తత్కాల పంచమి స్వాతి వివాహాదీనాం వృశ్చికోమతాం రహి రా1.02 (శుభాంశ)

24 ఆది షష్ఠి స్వాతి మీనోరహి ఉ7.52 (8 చంద్రః)

25 సోమ సప్తమి అనూరాధ గృహప్రవేశాదీనాం వృశ్చికోరహి రా12.54

28 గురు నవమి తత్కాల దశమి మూల గృహారంభాదీనాం మీనో మతాంరహి ఉ7.35 వివాహాదీనాం వృశ్చికోచోరః రా11.52

**మార్చి2** శని ఏకాదశి ఉత్తరాషాఢ వివాహాదీనాం వృశ్చికో మతాంరహి రా11.45

## ఫాల్గుణమాసము (7-3-2019 -5-4-2019)

**మార్చి8** శుక్ర విదియ ఉత్తరాభాద్ర అన్నప్రాశన క్రయవిక్రయ గృహారంభ ప్రవేశాదీనాం వృషభోరహి ఉ10.57 (8 శ) రేవతి వివాహ గృహప్రవేశాదీనాం వృశ్చికోరహి రా11.23 తదియ రేవతి వివాహ గృహారంభాదీనాం మకరం మతాంరహి తె4.02

9 శని తదియ రేవతి గృహారంభ ప్రవేశ అన్నప్రాశన అక్షరస్వీకారా దీనాం వృషభోరహి ఉ10.56 వివాహ గృహప్రవేశాదీనాం వృశ్చికోరహి రా11.19 అశ్విని చవితి గృహారంభ వివాహాదీనాం మకరోరహి తె3.58

10 ఆది చవితి అశ్విని అన్నప్రాశన గృహారంభ వివాహాదీనాం మీనో రహి ఉ6.56 వృషభోపి మతాంరహి ఉ10.79

13 బుధ సప్తమి రోహిణి గృహారంభ వివాహ వివాహ ఉపనయన ప్రవేశాదీనాం మీనోరహి ఉ6.44 వృషభోపివసుః ఉ10.37 (లగ్న చంద్రః) వివాహ గృహారంభాదీనాం మకరోమతాంరహి తె3.42

14 గురు అష్టమి మృగశిర ప్రవేశ అక్షరస్వీకార అన్నప్రాశనాదీనాం మీనోరహి ఉ6.40 నవమి మృగశిర వివాహ గృహారంభాదీనాం మకరోరహి తె3.38 (వృశ్చికోమతాంరహి తె10.56 (సంక్రమణం)

16 శని దశమి పునర్వసు అన్నప్రాశన గృహారంభ వైశ్యోపనయనాదీనాం వృషభోవసుః ఉ10.25 ఏకాదశి వృశ్చికోమతాంరహి రా10.48 ఏకాదశి పుష్యమి గృహారంభ వివాహాదీనాం మకరోరహి తె3.31

17 ఆది ఏకాదశి పుష్యమి డోలారోహణ క్రయవిక్రయాదీనాం కర్కాటకోమతాం ప2.11

20 బుధ చతుర్ధశి తత్కాల పౌర్ణమి ఉత్తర గృహారంభాదీనాం మకరోమతాం తె3.15 కుంభో వివాహోపి మతాం తె4.32

21 గురు పూర్ణిమ తత్కాల పాడ్యమి హస్త గృహారంభాదులకు మకరంరహి తె3.11 విదియ కుంభో వివాహోపిరహి తె5.27

22 శుక్ర విదియ చిత్త గృహారంభాదులకు మకరంచోరః తె3.07 వివాహాదీనాం కుంభోపిరహి తె5.23

23 శని తదియ తత్కాల చవితి స్వాతి వివాహ గృహారంభాదీనాం మకరంరహి తె3.03 కుంభోపిరాజ తె5.19

25 సోమ పంచమి షష్ఠి అనూరాధ గృహారంభాదీనాం మకరోరహి రా2.55

27 బుధ సప్తమి / అష్టమి మూల గృహారంభాదీనాం మకరోమతాం తె2.47 వివాహాదీనాం కుంభోరహి తె5.04

29 నవమి / దశమి ఉత్తరాషాఢ గృహారంభాదీనాం మకరోరహి రా2.39 వివాహాదీనాం కుంభోరాజ తె4.56

30 శని దశమి శ్రవణం మకరోరహి తె2.33 (లగ్నచంద్రః) ఏకాదశి వివాహాదీనాం కుంభోరహి తె4.52 (12 చంద్రః)

✦✦✦✦✦



# మేషరాశి ఫలితములు

**అశ్విని 1,2,3,4 - భరణి 1,2,3,4 - కృత్తిక 1**

**చూచెచోలా లీలులేలో**

**ఆదాయం: 2 వ్యయం: 14 రాజపూజ్యం: 5 అవమానం: 7**

ఈ రాశివారికి గురుడు వత్సరాది నుండి అక్టోబర్ 11 వరకు సప్తమమందు రజితమూర్తి. తదాది వత్సరాంతము వరకూ అష్టమమందు తామ్రమూర్తి. శని ఈ సంవత్సరము అంతయూ భాగ్యమందు రజితమూర్తి. రాహువు సంవత్సరాది నుండి మార్చి 2019 వరకు చతుర్థమందు కేతువు, దశమందు లోహమూర్తులు.

ఈ సంవత్సరము అక్టోబరు 11-2018 వరకు గురుడు సప్తమస్థితిచే ఆరోగ్యము చేకూరుట ప్రభుత్వం సహాయం లభించుట, శరీరపోషణకు సమయం వెచ్చించుట గత సంవత్సరములో నిలిచిన కార్యములు సిద్ధించుట, సమస్త కార్యముల యందు జయము. సుఖ సౌఖ్యములు పొందుట. వివాహము కాని వారికి వివాహము సిద్ధి. పుణ్యక్షేత్ర సందర్శనం, సంతాన లాభము. సంఘములో గౌరవము పెరుగును. అక్టోబర్ 11 తదుపరి అష్టమస్థితిచే సామాన్య ఫలితములు, దేహకష్టము, గాంభీర్యము తగ్గుట, కోపము పెరుగుట వంటి ఫలితములు ఉండును.

శని భాగ్యస్థితిచే స్థిరాస్తి కొనుగోలు మందగించుట, అనవసరపు ఖర్చులు పెరుగుట, మనశ్శాంతి లోపించుట, సంతానము మాట వినకపోవుట, ఒకానొకప్పుడు ధనలాభము చేకూరుట, కళత్రపర ఇబ్బందులు కలిగి సామాన్య ఫలితములు ఇచ్చును. చతుర్థ రాహువుచే చిత్తచాంచల్యము, వాత రోగాది పీడ. స్త్రీమూలక భయం ప్రయాణములు వాయిదా పడుట, తలత్రిప్పుట. కేతువు దశమ స్థితిచే స్నేహపర ఇబ్బందులు, బంధుసమాగమములో శుభకార్యసిద్ధి వంటివి జరుగును. గురుడు సప్తమ స్థితి సంచార కాలములో అశుభఫలితములు తగ్గించు అవకాశము కలదు.

## మాసవారీ ఫలితములు

**<u>చైత్రము:</u>** ప్రయాణము, బంధుమిత్ర విరోధము, ధనవ్యయం. స్థాన చలన సూచన కార్యాటంకములున్నప్పటికి గురుబలముచే చివరకు కార్య సాఫల్యత సిద్ధించును.

**<u>వైశాఖము:</u>** శిరఃపీడ, కార్యజయము, బద్ధకము, స్త్రీసౌఖ్యము, ధనప్రాప్తి, నూతన స్నేహ పరిచయములు, వస్త్రధారణ జరుగును.

**అధికజ్యేష్ఠము:** చెడు సావాసములు కలుగుట, మనస్సు కష్టము, సువర్ణవస్తు ప్రాప్తి, ఆరోగ్యభంగము, ఔషధసేవ, దైవక్షేత్ర దర్శనము.
**నిజజ్యేష్ఠము:** నీచజనులు ఎదురగుట, శరీర ఆరోగ్యము చేకూరుట, మనస్సున ఉల్లాసము, బంధువులు దగ్గర అగుట, ధనప్రాప్తి, సంతాన సౌఖ్యము, ఇష్టకార్యసిద్ధి, సోదరమూలక మాట పట్టింపులు, సన్మానం, శత్రుజయము.
**ఆషాఢము:** సుఖమునకు ఇబ్బంది కల్గుట, అకాలభోజనముచే ఇబ్బందులు, ప్రయాణముల యందు విఘ్నములు కలుగుట, కష్టము సంభవించిననూ తెలివిచే బయటపడుట, కాళ్ళనొప్పులు తదాది వస్తులాభము చేకూరును.
**శ్రావణము:** బద్ధకము పెరుగుట తద్వారా కార్యభంగము, స్నేహితులతో చిన్నపాటి ఇబ్బందులు , ద్రవ్యము ఖర్చు అగుట. బుద్ధి స్థిరత్వము, లేకపోవుట, జ్ఞాతులచే మాటపడుట, కుటుంబము వారిపై ఆగ్రహించుట.
**భాద్రపదము:** శత్రువిజయం, కార్యసాఫల్యం, శరీరసౌఖ్యము, వస్త్రలాభము, సంతోషము, ధాన్యాదివాహన లాభము, స్త్రీ సౌఖ్యము, తాపము కలుగును.
**ఆశ్వీయుజము:** చుట్టుప్రక్కల వారిపై ద్వేషము కల్గుట, భార్యతో చిన్నపాటి ఇబ్బందులు ఉన్నప్పటికిసౌఖ్యమే కలుగజేయును. సౌఖ్యం,బంధు సమాగమం, ప్రభుత్వపరమైన లబ్ధి, ద్రవ్యలాభం వంటి శుభఫలితములు ఉండును.
**కార్తీకము:** శత్రువులు పెరుగుట, చుట్టుప్రక్కలవారిచే మాటపడుట, దేహ కష్టములు, శరీరమందు నిస్సత్తువ, మీరు మంచి మాట్లాడినప్పటికి ఎదుటివారు చెడుగా అర్థము చేసుకొనుట వంటివి జరుగును.
**మార్గశిరము:** మీ తప్పులు లేకయే ఎదుటివారు మిమ్ములను నిందించుట, ధనవ్యయము, లాభము మందగించుట, మనోవిచారము కలుగుట. ఈ సమయమందు గురువార నియమం పాటించుట శుభము.
**పుష్యము:** నూతన వస్తు, ద్రవ్యప్రాప్తి, కొద్దిపాటి అనారోగ్యము, బంధువులు ఇంటికి వచ్చుట, మిత్రులుతో కలిసి వుండుట, ప్రభుత్వ ఉద్యోగుల సందర్శనము.
**మాఘము:** శుభకార్యములను నిర్వర్తించుట, ద్రవ్యలాభము, గృహమునందు సంతోషం, శుభవార్త వినుట, సత్సంగము చేయుట, ఇష్టములేని పదార్థములు భుజించుట, పిత్త ప్రకోపముచే అనారోగ్యము.
**ఫాల్గుణము:** స్థానభ్రంశము, దగ్గర బంధువులకు అనారోగ్యము, పై అధిరులచే మాటపడుట, జ్వరము, ప్రయాణముల యందు జాగ్రత్త, వాహన వేగము తగ్గించుట మంచిది.



# వృషభరాశి ఫలితములు

**కృత్తిక 2,3,4 - రోహిణి 1,2,3,4 - మృగ 1,2**

**ఈ ఉ ఏ　　ఓ వా వీ వూ　　వే వో**

**ఆదాయం: 11　వ్యయం: 5　రాజపూజ్యం: 1　అవమానం: 3**

ఈ రాశి వారికి గురుడు వత్సరాది నుండి అక్టోబర్ 11 వరకు షష్ఠమందు సువర్ణమూర్తి. తదాది వత్సరాంతము వరకు సప్తమ మందు సువర్ణమూర్తియే. శని ఈ సంవత్సరమంతయు అష్టమమందు లోహమూర్తి. వత్సరాది రాహువు తృతీయ మందు భాగ్యము, కేతువు 2019 మార్చి వరకు తామ్రమూర్తులు.

ఈ సంవత్సరము గ్రహపరిశీలన చేయగా గురుప్రభావం సువర్ణమూర్తి అగుటచే అష్టమ శని ప్రభావము తగ్గించును. షష్ఠ గురు ప్రభావముచే కళత్రముతోను, పుత్రులతోను మాట పట్టింపులు ఉన్నప్పటికీ సువర్ణమూర్తిచే ప్రభావము తగ్గి పరిష్కారము జరుగును. అక్టోబర్ 2019 తర్వాత సప్తమ స్థితితో నిలచిన కార్యములు సిద్ధించుట, వివాహ ప్రయత్నములు చేయు వారికి కార్యసిద్ధి, సంతానప్రాప్తి వంటి శుభఫలితములు గోచరించుచున్నవి. శని ప్రభావము అష్టమస్థితిచే ఈ సంవత్సరము కొద్దిగా అనారోగ్య సూచనలు కలవు. నరములు నిస్సత్తువ, మోకాళ్ళు కీళ్ళు నొప్పులు తద్వారా రాజౌషధ సేవ తప్పదు. బంధుజన విరోధం కలుగు సూచనలు. అలాగే వృత్తి, వ్యాపారములయందు జాగ్రత్త అవసరం. ఎవరినీ నమ్మరాదు. తృతీయ రాహువు నవమ స్థితిచే ఆర్థిక పురోగతి, శత్రుజయం, పదవీ ఉన్నతి, కార్యజయం, సంఘంలో గౌరవం, కీర్తి, సుఖశాంతులు, సోదరవర్గ సహాయం లభ్యత స్త్రీసౌఖ్యం. కేతువు నవమస్థితిచే లాటరీల యందు జాగ్రత్త అవసరం. విదేశీ ప్రయాణ సిద్ధి కలుగును.

విద్యార్థులకు ప్రథమార్థం శుభఫలము వుండును. ద్వితీయార్థములో విద్యార్థులు కష్టపడిన ఫలితములు బాగుండును. కాంట్రాక్టులు చేసే వారికి, లాయర్లకు అక్టోబరులోపు కలసి వచ్చుకాలము. పదోన్నతి కలుగును. పౌల్ట్రీ, సినీపరిశ్రమల వారికి సెప్టెంరు, అక్టోబరు లాభసాటిగా వుండును. షేర్‌మార్కెట్ వారికి జూలై, ఆగష్టు, సెప్టెంబరు నెలలు అనుకూలముగా వున్నవి. వ్యవసాయదారులకు మొదటి పంట లాభించును. నూనె, కిరాణా వ్యాపారస్తులకు కార్తీకమాసములోపు బాగుగా కలసివచ్చును.

ఈరాశి వారికి నవంబరు తదుపరి గురువార నియమములు, గురు చరిత్ర పారాయణ, గురుగ్రహ జపశాంతులు చేయించుట క్షేమదాయకం.

# మాసవారీ ఫలితములు

**చైత్రము:** స్థానభ్రంశం. బంధుమూలక అనారోగ్యం. ధనవ్యయం. ఆకస్మిక ప్రయాణములు చేయుట. ఆర్థికపరిపుష్టికై వెతుకులాట. ఉత్తరార్థం శుభఫలితాలు సంప్రాప్తించుట. సౌఖ్యం. బంధుమైత్రి.

**వైశాఖము:** శరీరబాధ. సంకటం. అకాలభోజనము. చుట్టములతో మాట పట్టింపులు. శిరోబాధ. సమయ నిబంధనలు పాటించకపోవుట వలన కష్టములు. శత్రువులు పెరిగే సమయం కావున జాగ్రత్తతో మెలగవలెను.

**అధికజ్యేష్ఠము:** నీచజన సాంగత్యం. చెడుస్నేహములు పెరుగుట. చంచల స్వభావం. బంధువైరం. బుద్ధిచెప్పినట్లు వినుటవలన చుట్టములు దూరమగుట జరుగును. విద్యాగోష్ఠి. మతిమరుపు సంభవించును.

**నిజజ్యేష్ఠము:** భోజన లోపం. శరీరబాధ. స్థానభ్రష్టత్వం కలహములు సంభవించుట. బుధప్రభావంచే సుఖము. ద్రవ్యప్రాప్తి. అప్పుడప్పుడు కల్గించును. సేవకాదులు దూరమగుట.

**ఆషాఢము:** విందుభోజనం. సంతానసౌఖ్యం. ఇష్టకామ్యసిద్ధి. శరీర అలసత్వము తగ్గుట. బంధుమిత్ర సమాగమం. మనోల్లాసం. గృహసంబంధ ప్రయత్నములు కనసాగించుట. ధనప్రాప్తి.

**శ్రావణము:** శుభకార్యములలో పాల్గొనుట. అభివృద్ధికి ప్రయత్నాలు ఫలించుట. ఉద్యోగములందు ఉన్నతి. ఆర్థిక పురోగతికై ప్రయత్నించినచో ఫలితం కలుగును.

**భాద్రపదము:** కోసం. అనారోగ్యము. కలహము. కళత్రముతో జాగ్రత్త.

**ఆశ్వీయుజము:** అపనిందలు పడకుండా జాగ్రత్త అవసరం. జూదముల నుండి వ్యసనముల నుండి తప్పించుకొనుట మంచిది. దైవసందర్శన అవసరం. తద్వారా ధనప్రాప్తి. ఆరోగ్యం. పుష్టి జరుగును.

**కార్తీకము:** గురుప్రభావంచే కష్టములు దూరమగుట. పితృసంబంధ అనారోగ్యం. దైవదర్శనం. భోజన సౌఖ్యం. ధనలాభం. నిలచిన కార్యక్రమములందు జయం.

**మార్గశిరము:** వ్యవహారజయము. కార్యసాఫల్యత. దూరదేశ ప్రయాణం. కార్యజయం. సౌఖ్యం. స్త్రీ సౌఖ్యం.

**పుష్యము:** పాత బాకీలు వసూలగుట. ధనము సంప్రాప్తి. పూర్వవైభవముకై కృషి. స్నేహితుల పరిచయం (నూతన). కళత్రమునకు ఆరోగ్యం. శరీరపుష్టి. వ్యాపారమునకై కృషి సాఫల్యత.

**మాఘము:** రాజదర్శనం. మిత్రులతో సంభాషణచే సత్ఫలితాలు. కళత్ర సుఖం. కుటుంబంలో సంతానమునకు వివాహ ప్రయత్నములు ఫలించుట.

**ఫాల్గుణము:** స్థానములో మార్పులు. గృహసంబంధ మార్పులు. శుభకార్య జయం. మృష్టాన్న భోజనము.



# మిథునరాశి ఫలితములు

**మృగశిర 3,4 ఆరుద్ర 1,2,3,4 పునర్వసు1,2,3**

**కా కి    కూ ఖం ఙ ఛ    కే కో హ**

**ఆదాయం: 14   వ్యయం: 2 రాజపూజ్యం: 4   అవమానం: 3**

వత్సరాది లగాయతు అక్టోబరు 11 వరకు గురుడు పంచమ మందు లోహమూర్తి. తదాది వత్సరాంతము వరకు షష్టమమందు రజితమూర్తి. శని ఈ సంవత్సరమంతయు సప్తమమందు తామ్రమూర్తి. రాహువు వత్సరాది మార్చి 2019 వరకు ద్వితీయమందు, కేతువు అష్టమమందు రజితమూర్తులు.

ఈ సంవత్సర గ్రహములను పరిశీలన చేయగా గురుడు అర్థలాభ మును స్వంత పనుల యందు ఆసక్తి పెరుగుట. బంధువులతో శుభకార్య ప్రయత్నములు. శని వల్ల రోగభయము. ధననష్టము. అనుకోని సమస్యలను కలిగించును. రాహుకేతువులు మిశ్రమఫలములతో కూడుకని వున్నవి. రాహువు వల్ల వాక్చాతుర్యముతో ఎదుటి వ్యక్తులను ఆకర్షింతురు. కొంత దేహసౌఖ్యమును పొందుటచే సంతోషమును కలిగించును. కేతు ప్రభావముచే మనోవిచారము. నాలుగు కాళ్ళ జంతువువలన శరీరబాధను కలిగించును, తగుజాగ్రత్తలు అవసరం. మొత్తము మీద ఈ రాశి వారికి శుభాశుభ ఫలములు గోచరించుచున్నవి. విద్యార్థులు శ్రద్ధపెట్టి, కష్టపడి చదివినగాని ఉత్తీర్ణత లభించదు. ఎంట్రన్స్ పరీక్షల యందు విజయము సాధించవలెనన్న చాలా శ్రద్ధ అవసరము. వ్యాపారస్తులకు నూనె, కిరాణా వ్యాపారములు అభివృద్ధిగా వుండును. సినీపరిశ్రమల వారికి అంత అనుకూల సమయం కాదు. వ్యవసాయదారులకు మొదటి పంట లాభిం చును. నూతన నటీనటులకు అవకాశములు వచ్చినప్పటికి నిలబడుట (విజయము) కష్టము వలన ఫలములు.

## మాసవారీ ఫలితములు

**చైత్రము:** ఆదాయానికి మించిన ఖర్చులు. అనుకోని వస్తువులు కొనుగోలు చేయుట. వాటివల్ల నష్టము. దూరపుబంధువులు రాక. సహనం వహించుట మంచిది. శుభము.

**వైశాఖము:** వృత్తివ్యాపారములు మందగించుట. వృథాప్రయాణములు, శతృభయం. శ్రమ. అస్వస్థత. పెద్దల సహకారం. వ్యతిరేకుల వల్ల ఒడిదుడుకులు నున్నను వాటిని నిబ్బరంగా ఎదుర్కొంటారు.

**అధికజ్యేష్ఠము:** పూర్వార్థం ఇబ్బందిగా వున్నప్పటికి మిగిలిన సంవత్సరము

కొంత మెరుగుగా వుండగలదు. భూసంబంధిత వ్యవహారాలను చక్కబెడ తారు. కుటుంబ విభేదములు కూడా తొలుగగలవు.

**నిజజ్యేష్ఠము:** ప్రయాణం వాయిదా పడినప్పటికి మాసం చివరలో అనుకూ లించును. దూరపుదృష్టితో ధనం పొదుపుచేస్తారు. ఉద్యోగస్తులకు కొద్దిపాటి ఉపశాంతి లభించగలదు. చిరాకులున్నప్పటికి సమయానుకూలముగా ప్రవర్తించడం వలన వాటి నుండి ఇబ్బందులు తొలగగలవు.

**ఆషాఢము:** అధిక ఖర్చులవల్ల కొంత సతమతమంగుట. వ్యతిరేకులపై విజయము. ఉద్యోగాభివృద్ధి. గవర్నమెంటు ఉద్యోగస్తులకు కొంత ఉపశాంతి లభించగలదు. ప్రయాణముల యందు జాగ్రత్త అవసరము.

**శ్రావణము:** ఈ నెలలో కూడా సామాన్య ఫలములే గోచరించు చున్నవి. శుభాది కార్యక్రమాలకై చేయు సంకల్పములు ముందుకు సాగుతాయి. ధనవ్యవహారములు కూడా ముందుకు సాగుతాయి. కొన్ని విషయముల యందు మధ్యవర్తిత్వము చేయవలసి రావచ్చును.

**భాద్రపదము:** సోదర పుత్ర వైషమ్యాలు. మనశాంతి లోపించుటచే చిరా కులు. పెద్దవారి ఆరోగ్యం మందగించుట. వ్యాపారసంబంధిత వ్యవహార ములయందు ప్రత్యేకశ్రద్ధ పెట్టుటమంచిది. ప్రయాణవాయిదాల వుండవచ్చు.

**ఆశ్వీయుజము:** కొంత మేరకు అనుకూల సమయముగా వుండగలదు. ప్రయత్నపర ఉద్యోగ బదిలీలు అనుకూలించుతాయి. శరీరకష్టం తగ్గుతుంది. వృత్తి వ్యాపారముల యందు సామాన్యము. బంధుమిత్రుల కలయిక. దైవపర కార్యక్రమాలలో పాల్గొనుట వుండగలదు.

**కార్తీకము:** వృధాప్రయాసచే ధనవ్యయము. దైవదర్శనములు. ఆరోగ్యభంగ ములు. మిత్రభేదములు. దూరప్రయాణములు చేయుట. కొన్ని అనుకూల ఖర్చులు కూడా వుండగలవు.

**మార్గశిరము:** నూతన వస్తుసేకరణ. ఇంటిలోనికివారికి ఆరోగ్యభంగములు. బంధువర్గమువారి ఇంట విందువినోదములలో పాల్గొనుట. అతిశ్రమ వల్ల ధనాదాయము. నూతన వ్యాపారవిషయములను ప్రారంభించుటకు ప్రయత్న ములు ఉండగలవు.

**పుష్యము:** సంతాన విషయముతో ఆలోచనలు శుభఫలములను ఇచ్చును. కొంత కార్య అనుకూలత ఏర్పడును. వ్యాపారవృత్తి విషయములలో కొంత పురోభివృద్ధి కనబడును. ఆర్థికంగా నిలద్రొక్కుకొనుటకు ప్రయత్నాలు చేస్తారు.

**మాఘము:** ధనం శుభపరవ్యయమును సూచించుచున్నది. భార్యకు అనారోగ్య లోపములు వుండవచ్చు. శరీరశ్రమ అధికమగుతుంది. కొన్ని పనులందు నిదానము అవసరము.

**ఫాల్గుణము:** కష్టపడి పనిచేసిన కాని ఫలము అందదు. భోజన సౌఖ్యము, దూర ప్రయాణ విషయముగా ఆలోచనలు, పెద్దల మన్ననలను పొందడానికి ప్రయత్నాలు. కొత్తవిషయముల యందాసక్తి. కొంత ద్రవ్యనష్టం ఉండగలదు.



# కర్కాటకరాశి ఫలితములు

పునర్వసు 4 పుష్యమి 1,2,3,4 ఆశ్లేష 1,2,3,4
హే హు హే హో డా డీ డు డే డో

| ఆదాయం: 8 | వ్యయం: 2 | రాజపూజ్యం: 7 | అవమానం: 3 |
|---|---|---|---|

గురుడు సంవత్సరాదిలగాయితు అక్టోబరు 2018 వరకు చతుర్ధమందు సువర్ణమూర్తి. తదాది వత్సరాంతం వరకు పంచమ మందు లోహమూర్తి. శని ఈ సంవత్సరమంతయు షష్ఠమమందు సువర్ణమూర్తి. వత్సరాది 2019 మార్చివరకు రాహువు జన్మమందు, కేతువు సప్తమమందు సువర్ణ మూర్తులు.

ఈ సంవత్సర గ్రహములు పరిశీలన చేయగా గురుడు ప్రథమార్ధము కొన్ని ఇబ్బందులు వున్నప్పటికి మూర్తిమంత శుభత్వము చేకొని శుభఫలిత ములు ఉన్నవి. ద్వితీయార్ధములో అర్ధలాభ ఫలితములు ఇచ్చును. మూర్తివం తముచే కొన్ని ఇబ్బందులు, బంధునష్టము, ధననష్టము కలుగచేయును. శని వలన శుభఫలము సూచించుచున్నది. ధనధాన్యాభివృద్ధి, బంధువుల వల్ల శుభ వార్తలు వినుట, స్త్రీ సౌఖ్యము, నూతన గృహమునకు సంబంధిం చిన వ్యవహారములు ముందుకు సాగుతాయి. రాహు, కేతు విషయమై పరిశీలనచేయగా మూర్తివంతముచే శుభముతో కూడిన సమస్యలు, అనవ సర ఖర్చులు, శరీరకష్టం, శస్త్రచికిత్సలు వంటి పలములు సూచించుచున్నవి.

విద్యార్థులకు ప్రథమార్థం పరీక్షలలో ఉత్తీర్ణత పొందుట, ద్వితీయార్థంలో కష్టపడి చదినను తగిన ఫలములు పొందలేకపోవుట, నూనె, కిరాణా వ్యాపారస్తుల వ్యాపారములు బాగుండును. వ్యవసాయ రంగముల వారికి మిశ్రమ ఫలములు వుండును. పౌల్ట్రీ పరిశ్రమలు మొదట కొంత ఇబ్బంది వున్నప్పటికి చివరకు లాభము కలదు. నూతన నటీనటులకు శుభకాలము. కొన్ని విజయములు కూడా సూచించుచున్నవి.

## మాసవారీ ఫలితములు

**చైత్రము:** శుభకార్యక్రమ వ్యవహారాలు చక్కబెడతారు. ధనవృద్ధి వుండలదు. మిత్రులతో శుభకార్యక్రమ వేడులలో పాల్గొంటారు. రాజకీయవృద్ధి వుండ గలదు. పూర్వపు సమస్యలు కొన్ని తీరుతాయి.

**వైశాఖము:** అనుకొన్న కార్యక్రమములను విజయవంతముగా పూర్తి చేస్తారు. నూతన గృహలబ్ది. సంతానమునకు శుభఫలములు సూచించు చన్నది. ప్రభుత్వపర ఉద్యోగులను కలుసుకొనుట వుండగలదు.

**అధికజ్యేష్ఠము:** గృహంలో ఆనందం. ఆశయసిద్ధి ప్రయత్నము ఉత్తరార్థంలో

కొంత వ్యతిరేకత. ప్రయాణంలో అపశ్రుతులు. బ్యాంకు ఉద్యోగులకు ప్రమోషన్లు. ధనపరమైన చిక్కులు కలుగును.

**నిజజ్యేష్ఠము:** రైతులకు ఋణబాధలు తొలగి కొంత సౌఖ్యము ఏర్పడగలదు. విద్యార్థులకు గుర్తింపు లభించగలదు. కొన్ని వ్యాపారములు అభివృద్ధిల్లో ఉండగలవు. లోహవ్యాపారము చేయు వారికి వృద్ధి గలదు. ధనము ఖర్చు పెరుగుట. సాంఘికపర కార్యక్రమముల యందు ఆసక్తి కలుగును.

**అషాఢము:** గృహాదివస్తుక్రయం. వృత్తి ఉద్యోగాలలో అధికశ్రమ. ధారాపుత్ర వైషమ్యాలు అప్రయత్నంచే శుభకార్యాలు సిద్ధి. వ్యాపారాభివృద్ధి ఉండగలదు.

**శ్రావణము:** ప్రథమార్థంలో బాగున్నప్పటికీ ఋణసౌఖ్యము. వృత్తి ఉద్యోగ కృషి. రంగాలలో అధికశ్రమ. అస్వస్థత. ఔషధసేవ. శని శుభమగు వలన ఒడిదుడుకులు తగ్గుట. శుభకార్య ప్రయత్నములు ముందుకుపోవుట. దూర ప్రయాణాదులు ఉండవచ్చును.

**భాద్రపదము:** ఈ నెలలో శుభాశుభమిశ్రమ ఫలితములు ఉన్నవి. పూర్వార్థం బాగున్నప్పటికి మనశ్శాంతి లోపించుట వృథా ప్రయాణములు. అనవసరపు ఖర్చు. స్త్రీవల్ల అనుకోని సమస్యలు. వ్యాపారంలో కొంత నష్టం ఉండగలవు.

**ఆశ్వీయుజము:** అనుకొన్న పనులయందు విజయము సాధించుట. శత్రువులపై జయము. దైవపర క్షేత్ర సందర్శనము. కళత్ర సౌఖ్యములు. వివాహాది శుభ కార్యక్రమముల విషయములలో ఒడిదుడుకులు వచ్చినను సమర్థవంతముగా ఎదుర్కొందురు.

**కార్తీకము:** పనులపై దృష్టిపెట్టినప్పటికి కొన్ని మందగించి, కొన్ని ముందుకు సాగుతాయి. బంధువులలో సమాగము పుణ్యకార్యాసక్తి. విద్యాసారస్వత రంగములలో అభివృద్ధి. ఆదాయమునకు మించిన వ్యయము ఉండగలవు.

**మార్గశిరము:** పెద్దల ఆదరాభిమానములు లభించగలవు. మధ్యమధ్య ప్రతికూల సమస్యలు కూడా మీరు అనుకూలంగా మార్చుకొందురు. వివాహాలు, శుభకార్యక్రమాలు. కొద్దిపాటి జాప్యముతో ముందుకు సాగుతాయి. సంతానపర శుభసూచికలు కనిపించుచున్నవి.

**పుష్యము:** భార్యాభర్తల మధ్య అభిప్రాయ భేదములు ఏర్పడినప్పటికి మధ్యవర్తులచే అవి సర్దుమణగ గలవు. కుటుంబములో పట్టింపుల వల్ల కొన్ని ఇబ్బందులు, చిరాకులు తలెత్తగలవు. వ్యాపారపరవృద్ధి ఉండగలదు. ఉద్యోగస్తులు పై అధికారుల వల్ల లాభము.

**మాఘము:** వివాహ, భూ, గృ, వ్యాపార, ఉద్యోగ, కృషిరంగాలలో లాభముచే కూడగలదు. శత్రువుల కూడా మీమాటకు విలువనిస్తారు. వివాహాదిశుభ కార్యక్రమాలలో బంధుమిత్ర సమేతంగా పాల్గొందురు.

**ఫాల్గుణము:** పెద్దల సహకారముచే శుభకార్యక్రమముల నిర్వహణ. వస్తు వాహనములు కొనుట. స్వయంకృషిచే వృద్ధి. సంతానఫల శుభలాభములు. ధైర్యంతో కొన్ని కార్యక్రమాలు నిర్వహించుట. వ్యాపారవృత్తి లాభములు ఉండును.



# సింహరాశి ఫలితములు

మఖ 1,2,3,4 పూ॥ఫల్గు 1,2,3,4 ఉ॥ఫల్గు 1
మా మి మూ మే మో టా టే టు టే

**ఆదాయం: 11 వ్యయం: 11 రాజపూజ్యం: 3 అవమానం: 6**

గురుడు వత్సరాది అక్టోబరు 11వరకు తృతీయమందు తదాది వత్స రాంతం వరకు చతుర్థమందు తామ్రమూర్తియే. శని ఈ సంవత్సరమంతయు పంచమమందు రజితమూర్తి. వత్సరాది మార్చి 2019 వరకు వ్యయమందు రాహువు షష్ఠమ మందు కేతువు లోహమూర్తులు.

ఈవత్సరం గురుఫలము చూడగా అతిశ్రమను, బంధువులతో విరోధ మును, శరీర కష్టమును, ఉద్యోగమునందు ఇబ్బందులను, అనవసరపు తగవులను స్వస్థానము విడచి దూరప్రాంతములకు పోవుట గురుఫలములు సూచించుచున్నది. శని మూర్తివంతముచే శుభాశుభ ఫలితములు సూచించు చున్నది. కార్యహాని, మనస్థాపము, స్త్రీ సంభోగము, సంతాపము, పుత్రమూ లక సమస్యలు. రాహుకేతువులు ఫలితములు చూడగా అనారోగ్యము, ధననాశనము, శత్రుభయము, స్థానభ్రంశము. అనుకొన్న పనులు నెరవేరక పోవుట. ఇత్యాది ఫలితములు సూచించుచున్నవి.

విద్యార్థులకు అతికష్టము మీదగాని పరీక్షలయందు ఉత్తీర్ణత పొందలేరు. నూనె, కిరాణా వ్యాపారముల వారికి ఆశించిన లాభములు ఉండవు. వ్యవసాయదారులకు రెండు పంటలు కూడా కలసివచ్చుట కష్టము. పౌల్ట్రీ పరిశ్రమల వారికి, సినిమా నటీనటులకు అంత మంచి కాలములు కావు. సినిమా విజయ అవకాశములు తక్కువ. రాజకీయ నాయకులకు అనుకొన్న ఫలితములు కూడా తక్కువ.

## మాసవారీ ఫలితములు

**చైత్రము:** ద్రవ్యనష్టము. అపజయములు. ఉద్యోగవ్యాపారములలో బాధ్య తాపర బాధలు అధికమగును. మానసికంగా ఆందోళన పెరుగును. అనా రోగ్యసూచనలు కనబడును. దూరప్రయాణములయందు జాగ్రత్త అవసరము.
**వైశాఖము:** ప్రతికూల పరిస్థితులు. ఆందోళన. అస్వస్థత. విరోధుల నుండి వత్తిడి. రావలసిన ధనం ఆలస్యమగుట. దీర్ఘాలోచన. ఇంట అనారోగ్యములు కలుగవచ్చును.
**అధికజ్యేష్ఠము:** శ్రమ వృథాగా ప్రయాణము. అనవసరపు కలహములు. వ్యాపారపర బాధ్యతా వత్తిడి. కొన్న వస్తువులను పోగొట్టుకొనుట. కొంత ధైర్యము వహించి ముందుకు సాగుట మంచిది.

**నిజజ్యేష్ఠము:** శ్రమ. సంతాపము. చరస్థిరాస్తి విషయమై విభేదములు. అతికష్టముపై వివాహాది శుభకార్యక్రమములు సిద్ధించును. వ్యతిరేకుల వలన కుటుంబములలో సమస్యలు రావచ్చును.
**ఆషాఢము:** వృత్తిపరలాభములు. వ్యాపారములో కొద్దిపాటి లాభము. శ్రమ. ప్రత్యర్థుల వత్తిడి వల్ల మధ్యమధ్య కొన్ని అపవాదులు. చిక్కులు ఉన్నప్పటికి ఆర్థికస్థితిబాగుండుటచే సమస్యలకు పరిష్కారం. అనారోగ్యసమస్యలు కలవు.
**శ్రావణము:** కొంత కార్యసిద్ధి ఉన్నప్పటికి ఆదాయము తగ్గడంతో ఖర్చు పెరుగుట వలన పనులలో జాప్యము. అపనిందలు. సోదరపుత్ర వైషమ్యాలు. అసౌఖ్యం. శ్రమ. వత్తిడి ఉండగలవు. మధ్యవర్తిత్వంలో మాటపడే అవకాశం. తగు జాగ్రత్త మంచిది. ప్రయాణములు వాయిదా వేయుట మంచిది.
**భాద్రపదము:** శ్రమతో కొన్ని పనులు ముందుకుసాగగలవు. స్త్రీమూలక లాభములు ఉండగలవు. ఖర్చు అధికముగావడంతో వ్యాపారపర పెట్టుబడుల ఇబ్బంది ఎదుర్కొనవలసి వచ్చును. కోర్టుపర చిక్కులు తొలగే అవకాశము ఉన్నది. ఇష్టదీపారాధన వలన శుభఫలములు పొందగలరు.
**ఆశ్వీయుజము:** గృహములో అనవసరపు సమస్యలు. నూతన వ్యక్తి వలన ఇబ్బందులు. స్థానచలనము. నెల చివరలో అతికష్టముపై ధనలాభము. ఋణప్రయత్నములు ఫలించును. ఉద్యోగస్తులకు కొంత ఊరట కలుగును.
**కార్తీకము:** కొంత మీ మనోరథము నెరవేరు అవకాశము ఉన్నది. కొన్ని పనులు మాత్రమే ముందుకు సాగుతాయి. విందువినోదాలలో పాల్గొంటారు. నిరుద్యోగులకు కొంత కష్టకాలముగా చెప్పవచ్చును.
**మార్గశిరము:** శ్రమ. సంతాపము. జాప్యము. చరస్థిరాస్తి విషయములలో అనుకోని సమస్యలు. భూమిపర వ్యవహారములలో కొన్ని ఇబ్బందులు. రాజకీయంగా ఊహించని సమస్యలు. మానసికఒత్తిడి అధికంగా ఉండును.
**పుష్యము:** సంతాన విషయములో సమస్యలు అధికమవుతాయి. వ్యతిరేకుల నుండి కొన్ని చిక్కులు ఎదుర్కొనవలసి వచ్చును. అయినప్పటికి ధైర్యముగా ఎదుర్కొన కలుగుతారు. భాగస్వామిక వ్యాపారములలో వృద్ధి కోసం పెట్టు బడులు పెడతారు. ఆరోగ్యము మందగించే అవకాశము ఉన్నది.
**మాఘము:** భార్యాభర్తల మధ్య విభేదములు పెరిగే అవకాశము ఉన్నది. కావున తగు జాగ్రత్తగా ఉండుట మంచిది. రాజకీయపర లబ్ధి ఉండగలదు. ఉద్యోగస్తులు నూతన అవకాశములకై ప్రయత్నాలు చేస్తారు. ధనము ఖర్చు పెరిగినప్పటికీ అది శుభముగానే ఉండగలదు.
**ఫాల్గుణము:** నిరుద్యోగులకు అనుకూల సమయం. ఆరోగ్యం కొంత మంద గించవచ్చును. ప్రయాణ విషయములో తగుజాగ్రత్త వహించుట మంచిది. భూ, గృహ వ్యాపార, కృషి రంగములలో కొంత వృద్ధి కనిపిస్తుంది.



# కన్యారాశి ఫలితములు

| ఉ॥ఫల్గు 2,3,4 | హస్త 1,2,3,4 | చిత్త 1,2 |
|---|---|---|
| టో పా పి | పూ షం ణా ఠ | పే పో |

**ఆదాయం: 14 వ్యయం: 2 రాజపూజ్యం: 6 అవమానం: 6**

గురుడు వత్సరాది అక్టోబరు 11వరకు ద్వితీయమందు తదాది వత్స రాంతం వరకు తృతీయమందు రజితమూర్తి. శని ఈ సంవత్సరమంతయు అర్థాష్టమ మందు లోహమూర్తి. వత్సరాది మార్చి 2019 వరకు రాహువు లాభమందు, కేతువు పంచమమందు సువర్ణమూర్తులు.

ఈసంవత్సరం ఈ రాశివారికి గురు బలము ఉన్నప్పటికి శని అర్థాష్టమ స్థితిచే మనసుకు భీతి, స్వస్థానహాని, శరీర కష్టము, అనారోగ్య ఇబ్బంది. దేహపీడ కలుగజేయును. కంఠక శనివలన సమస్యలు అధికముగా ఎదుర్కొనవలసి వచ్చును. గురుప్రభావము వలన గౌరవము, కీర్తి లభించ గలదు. రాహుప్రభావముచే సుఖభోజనము, వస్త్రలాభము, కేతు ప్రభావము వలన పుత్రులతో విరోధము సూచించుచున్నది. పై అధికారులచే లబ్ధి చేకూరే అవకాశము కలదు. విద్యార్థుల విషయమై చూడగా ఉత్తీర్ణత శాతము బాగున్నది. వ్యాపారస్తులకు కూడా లాభయుక్తముగానే ఉన్నది. వ్యవసాయ దారులకు రెండు పంటలు కూడా లాభించును. సినీమా, పొలిటీ రంగముల వారికి కూడా అభివృద్ధిగానే ఉన్నది. ఈసంవత్సరం ఈరాశివారికి శనికంఠక శని.

## మాసవారీ ఫలితములు

**చైత్రము:** అన్నిరంగములలో అభివృద్ధి అదనపు ఆదాయము. గృహములో ఆనందం. వివాహ, గృహ వ్యాపారాదులలో అభివృద్ధి. విద్యార్థులకు విజయ సమయము. వివాహ సంబంధిత కార్యక్రమములు ముందుకు సాగుతాయి.

**వైశాఖము:** శ్రమకు తగ్గ ఆదాయము. ద్రవ్యహాని. ఇటువంటి శుభాశుభ ఫలితములతో మిశ్రమముగా నడుచును. మానసిక ఆందోళన కూడా వెంటాడుతుంటుంది. వివాహాది శుభకార్యక్రమాలు ముందుకు సాగుతాయి.

**అధికజ్యేష్ఠము:** వ్యాపారాలలో ఆదాయము మందగిస్తుంది. రియల్ ఎస్టేట్ వ్యాపారము బాగుండును. ఆరోగ్యము మందగించుటచే కొంత ఇబ్బంది కలుగగలదు. కొన్ని పనుల యందు అనుకోని ఇబ్బందులు ఎదుర్కొందురు.

**నిజజ్యేష్ఠము:** అనుకోని ప్రయాణములు ఉండగలవు. ఖర్చు పెరిగినప్పటికి ఇబ్బంది కలుగదు. బాధ్యతలు పెరుగుతాయి. వ్యతిరేకుల వల్ల సమస్యలు రాగలవు. ఒక్కొక్కసారి మిత్రులుచే సాయము పొందగలరు.

**ఆషాఢము:** ధనవ్యయము అధికమవుతుంది. కొన్ని సమస్యలు తీరినప్పటికి ప్రశాంతత చేకూరదు. కొత్త వ్యక్తులు జీవితంలోకి వచ్చే అవకాశమున్నది. అనవసరపు ప్రయాణములు మీ మనస్సును చికాకు పెట్టగలవు. ప్రయాణముల యందు తగుజాగ్రత్త తీసుకొనుట మంచిది.

**శ్రావణము:** ఆదాయము పొదుపు చేయుట కష్టమగును. ఆయుధపీడ. వివాహాది శుభకార్యక్రమములు. కార్యసిద్ధి. అభివృద్ధి. శారీరకశ్రమ. మిశ్రమ ఫలితములతో ఉండగలదు. ఆస్థి విషయమై అనుకోని సమస్యలు రాగలవు.

**భాద్రపదము:** అనుకోనిచికాకులు ఎదుర్కొనరావలసివచ్చును. శ్రమ అధికమగును. ఆర్థికపరిస్థితి మెరుగైనప్పటికి బంధువుల వలన అనుకోని సమస్యలు ఏర్పడవచ్చు. వ్యాపారముపై పెట్టుబడులకై చేయు ప్రయత్నములు అతి కష్టము మీద ముందుకు సాగుతాయి.

**ఆశ్వీయుజము:** కృషి, వ్యాపారాలు మందగించును. వివాహాది శుభకార్యములు కూడా జాప్యము. చిరాకును కలుగజేయును. కొన్ని విషయములు మనస్సును ఆనందింపచేస్తాయి. రాజకీయ నాయకులకు సంఘములో గుర్తింపు లభిస్తుంది. మిత్రులతో సంతాన విషయమై చర్చలు జరుపుదురు.

**కార్తీకము:** వ్యాపార లాభములు ఉన్నప్పటికి ధనవ్యయము వలన కొంత ఇబ్బందులు ఉండగలవు. ఆరోగ్యము అనుకూలించును. స్నేహితులతో విహారయాత్రలు చేయుదురు. కొన్ని అనుకోని బాధ్యతలు మీరు తీసుకోవవలసి రావచ్చును. నిరుద్యోగులకు అనుకూల సమయము.

**మార్గశిరము:** ఊహించని విధంగా ఆశయసిద్ధి. నూతన స్నేహలాభములు. శుభ కార్యక్రమములో బంధుమిత్రుల కలయిక. శ్రమకు తగిన ఫలితము. శత్రువులు కూడా మిత్రులుగా ప్రవర్తించెదరు. ఒడిదుడుకులు తగ్గుతాయి. ఉద్యోగస్తులకు కొంత ఇబ్బంది కాలము.

**పుష్యము:** ధనవ్యయము. కలహములు. ఆందోళన. దూరప్రయాణములలో అనుకోనిసమస్యలు. దైవక్షేత్ర సందర్శనం. అనారోగ్య ఇబ్బంది. విద్యార్థులకు శుభఫలములు సూచించుచున్నవి. ఇంట శుభకార్యక్రమ ప్రయత్నములు వాయిదా పడే అవకాశము కలదు.

**మాఘము:** ధనవ్యయము. మాటపడుట. ప్రయాణములలో చోరభయము. శుభమూలక ధనవ్యయు. ఆరోగ్యలోపములు. అసహనం పెరుగుట. నూతన వ్యవహారములు కొన్ని మాత్రమే ముందుకుసాగుట. అనుబంధాలు బలపడుట. పై అధికారులకు సహాయపడుట.

**ఫాల్గుణము:** వ్యాపారస్తులకు అభివృద్ధిపరంగా ఉన్నప్పటికి ప్రభుత్వ అధికారుల వలన కొన్ని ఇబ్బందులు. రాజకీయ నాయకులు గుర్తింపు కొరకు నూతన వ్యవహారములను సాగించును. కొన్ని వ్యాపారములు లాభించును.

# తులారాశి ఫలితములు



| చిత్త 3,4 | స్వాతి 1,2,3,4 | విశాఖ 1,2,3 |
|---|---|---|
| రా రి | రూ రె రో త | తీ తు తే |

**ఆదాయం: 11 వ్యయం: 5 రాజపూజ్యం: 2 అవమానం: 2**

గురుడు వత్సరాది లగాయితు అక్టోబరు 11వరకు జన్మమందు లోహ మూర్తి. తదాది వత్సరాంతం వరకు ద్వితీయమందు తామ్రమూర్తి. వత్సరాది మార్చి 2019 వరకు రాహువు దశమ మందు, కేతువు చతుర్థమందు తామ్రమూర్తులు.

ఈ సంవత్సరము ఈరాశి వారికి గురుడు జన్మసంచార స్థితిచే కీర్తికి హాని, పై అధికారులచే ఇబ్బందులు, ధనవ్యయము, భయము, విరోధము కలుగజేయును. ద్వితీయార్థమందు యశోవృద్ధిని, సౌభాగ్యమును, ధనాదా యమును, ధర్మకార్యములు చేయించే సంతోషము కలుగజేయును. శని తృతీయ సంచారము స్త్రీ సంభోగము, హృదయ సౌఖ్యము ఇచ్చినప్పటికి మూర్తివంతముచే చెడు ఫలములు కూడా సూచించుచున్నది. రాహువు దశమ సంచారముచే మంచి ఫలితములున్నను, కేతువు చతుర్థ సంబంధము వలన చిత్తచాంపల్యమును, స్త్రీ మూలక అపకీర్తిని, బంధువర్గ సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చును. విద్యార్థులు విషయమై ఎంత కష్టపడినప్పటికి శుభఫలితములు వచ్చుట కష్టముగా ఉండును. వ్యాపారస్తులకు ప్రభుత్వ అధికారుల వలన ఇబ్బందులు ఉండగలవు. పొలిటీ, సినీ రంగముల వారికి సామాన్య ఫలితములు. వ్యవసాయదారులకు మొదటి పంట కొంత మాత్రమే అనుకూలముగా ఉండును.

## మాసవారీ ఫలితములు

**చైత్రము:** కుటుంబంలో సమస్యలు పెరుగుట. ప్రభుత్వ అధికారుల వత్తిడి, అనుకోని విషయములలో చిక్కుకొనుట. దూరప్రాంత బదిలీలు. శుభకార్యక్ర మాల విషయములు చర్చించుటకు నూతన వ్యవహారాలను చక్కబెట్టుదురు.
**వైశాఖము:** శుభాశుభ ఫలితాలతో కూడుకొని ఉండును. సోదరుల వలన విరోధములు కొంత కార్యానుకూలత. గృహ సౌఖ్యము. బంధువర్గములోని వారికి ఇబ్బంది. ప్రభుత్వ అధికారులను సందర్శించుట. ధనవ్యయము.
**అధికజ్యేష్ఠము:** కొంతప్రతికూల పరిస్థితులు కనిపించినప్పటికి గృహ కలహ ములు సర్దుమనుగడంతో కొంత ప్రశాంతత ఏర్పడగలదు. కొన్ని పనులు పట్టుదలతో సాధించవలసి ఉంటుంది. వృత్తివ్యాపారములు సజావుగానే సాగుతాయి. బంధువులతో విరోధము కలిగే అవకాశము.

**నిజజ్యేష్ఠము:** ఈ మాసములో యాత్రా సౌఖ్యము. ధననష్టము. అధికశ్రమచే కార్యసిద్ధి. కోర్టు వ్యవహారాలు చక్కపెట్టుట. వ్యవసాయదారులకు, వ్యాపారులకు కొంత అశాంతి. పరిశ్రమలవారికి మిశ్రమ ఫలితాలు గోచరించుచున్నవి.
**ఆషాఢము:** కొన్ని ప్రతికూలపరిస్థితులు ఏర్పడినప్పటికి సమస్యలను పరిష్కరించుకొనగలుగుతారు. వివాహాది శుభకార్యముల విషయంలో ప్రశాంతత. సమయమునకు ధనము చేతికి అందును. ఆరోగ్య విషయమై తగు జాగ్రత్త.
**శ్రావణము:** గృహమందు వివాహాది శుభకార్యక్రమములకు సంబంధించిన విషయ చర్చలు జరిపెదరు. మధ్యమధ్య చిరాకులు కలిగిన అవి మంచుపడినట్లు ఏడిపిస్తాయి. వృత్తి, వ్యాపారులకు కొంత అనుకూల కాలము. బంధుమిత్రుల రాకతో గృహము సందడిగా ఉండును.
**భాద్రపదము:** వ్యాపారస్తులకు మంచి సహాయం అయినప్పటికి ధనవ్యయం అధికమగును. గృహంలో ఏర్పడిన కలహములను పరిష్కరించెదరు. కోపమును అదుపులో ఉంచుకొనుట మంచిది. దైవచింతన వలన ఇష్టకార్యసిద్ధి.
**ఆశ్వీయుజము:** ఉద్యోగపరమైన లాభములు. సంతానపర శుభములు. బంధుమిత్రుల ఆగమం. మాతృవర్గముల సమస్యలు. అనుకోని లాభములు. నూతన వస్తుసేకరణ.. వాహన ప్రయాణమందు తగుజాగ్రత్తల అవసరం.
**కార్తీకము:** దైవపరమైన యాత్రలు. ధనలాభము. ఆదాయం పెరుగుట. చిక్కులు తొలగి శుభము చేకూరుట. వ్యవసాయదారులకు కొంత పంట అనుకూలము. కుటుంబ బాధ్యతలు పెరుగుట. గృహవస్తు సేకరణ. దూరపు బంధువుల ఆగమనము ఉండగలవు.
**మార్గశిరము:** కుటుంబ శుభకార్యక్రమములు నిర్వహించుట. విందువినోదాలలో పాల్గొనుట. మాతృవర్గ సమస్యలు. విద్య, సారస్వతకృషి. వ్యాపారములయందు అభివృద్ధి. శ్రమ అధికమయినా ధనలాభము ఉండగలదు.
**పుష్యము:** అనుకోని వ్యక్తులవలన మానసిక ఆందోళన. గృహకలహములు. ఋణపరమైన వత్తుడులను ఎదుర్కొనుట. రాజకీయ నాయకులకు అవమానములు. ఉద్యోగస్తులకు పై అధికారుల వల్ల ఇబ్బందులు ఉండగలవు.
**మాఘము:** శరీరఅనారోగ్యం. మానసికాందోళన. అనవసరపుఖర్చు. బంధువైరం. భార్యాపుత్రుల ధాతృ వైరములు. ప్రయాణములో అపశృతులు ఉండ గలవు. శ్రమకుతగిన ఫలితం కష్టము. ధనపరమైన సమస్యలు తగ్గును.
**ఫాల్గుణము:** కొంత ఆందోళన తగ్గుట. గతకాలము కన్నా కొంత వృద్ధి. నూతన వ్యవహారములలో లాభము. పై అధికారుల పలుకుబడితో ఉద్యోగము నందు ప్రమోషన్లు. శత్రుజయము. విద్యార్థులు శ్రమచే పరీక్ష ఉత్తీర్ణత సాధించుట. బంధుమిత్రులతో దూరప్రయాణములు.



# వృశ్చికరాశి ఫలితములు

విశాఖ 4 అనూరాధ 1,2,3,4 జ్యేష్ఠ 1,2,3,4

తో నా ని నూ నే నో యా యీ యూ

**ఆదాయం: 2 వ్యయం: 14 రాజపూజ్యం: 3 అవమానం: 2**

గురుడు సంవత్సరాది లగాయితు అక్టోబరు 11 వరకు వ్యయమందు తామ్రమూర్తి. తదాది వత్సరాంతం వరకు జన్మమందు లోహమూర్తి. శని ఈ సంవత్సరమంతయు ద్వితీయమందు రజితమూర్తి. ఉగాది లగాయితు మార్చి 2019 వరకు రాహువు భాగ్యమందు, కేతువు తృతీయ మందు రజితమూర్తులు.

ఈ సంవత్సరము గురుడు యొక్క ప్రథమార్థ ఫలితము ద్వితీయార్థ ఫలితము చూడగా కీర్తిహాని. వృద్ధి భ్రంశము, భాగ్యహాని, రాజులకు భయము కలిగించు సూచనలున్నవి. శని ద్వితీయస్థాన ఫలితము చూడగా ధనవ్యయము, బంధువిరోధము, కార్యములు పాడగుట, ఇటువంటి ఫలిత ములతో కూడుకొని ఉన్నది. ఈ సంవత్సరము వీరికి ఏలినాటి శని. ఇక రాహుఫలం పరిశీలించగా రాహు భాగ్యస్థాన స్థితిచే ప్రయాణము నందు ఆటంకములు కలిగిననూ అది మూర్తివంతముచే శుభఫలములనే సూచిం చును. కేతువు తృతయమునే గౌరవభంగము. ధాతృద్వేషము ఇటువంటి ఫలితములు ఉండగలవు. విద్యార్థులకు చూడగాకష్టపడి చదివినప్పటికి ఫలితము వచ్చుట కష్టము. నూనె, కిరాణా వ్యాపారస్తులకు ప్రభుత్వాధికారుల వల్ల ఇబ్బంది, ధననష్టము కలుగును. వ్యవసాయదారులకు రెండుపంటలు కూడా ఆశించిన ఫలితములు ఇవ్వవు. పౌల్ట్రీ, సినీవ్యాపారరంగాలు కూడా అంతగా లాభించవు. రాజకీయనాయకులకు సామాన్యఫలములు ఉండును.

## మాసవారీ ఫలితములు

**చైత్రము:** సంతాన సమస్యలు. శ్రమ. కలహములు. అనుకోని చిక్కులలో చిక్కుకొనుట. మానసిక వ్యథ ఉండగలవు.

**వైశాఖము:** వాహనపరమైన ఇబ్బందులు. శుభపరమైన ఖర్చులు. వ్యాపార అనుకూలత. నూతన వస్తుసంగ్రహం. కుటుంబపరమైన ఖర్చులు పెరుగుట. ఋణ ప్రయత్నాలు ఫలించకపోవుట. మానసిక వత్తిడి వలన ఇబ్బందులు.

**అధికజ్యేష్ఠము:** వివాహపరమైన లాభములు. వ్యాపార, వృత్తి, ఉద్యోగము లలో కొంత ప్రోత్సాహము. కళత్రాదిపీడ. పూర్వపు సమస్యలు తిరిగి సమస్యగా మారుట. బంధువిరోధము కలిగించును.

**నిజజ్యేష్ఠము:** ఊహించని ఖర్చులు పెరుగుట. శుభకార్య ప్రయత్నములు ముందుకుసాగుట. బంధుమిత్రులకై ధనం ఖర్చుచేయుట. రోగపీడ, ఫైనాన్స్ వ్యాపారంవారికి అనుకోని చిక్కులు. ఋణప్రయత్నాలు ముందుకుసాగవు.
**ఆషాఢము:** అనవసరపు ఆందోళన పెరుగును. ధనవ్యయము పెరుగుట. భార్య యొక్క ఆరోగ్యము మందగించుట. నీటి సంబంధిత హాని. అభివృద్ధి కుంటుపడుట. స్త్రీమూలక ధనాదాయం. ఎక్కువ శ్రమచే పనులందు లాభం.
**శ్రావణము:** వివాహాది శుభకార్యక్రమములు ముందుకుసాగుట. శుభపర మైన ఖర్చులు. రాజకీయనాయకులకు వత్తిడులు. మిత్రులవలన పెద్దవారితో కలయిక. సంఘములో కొంత అనుకూల వాతావరణము ఏర్పడును.
**భాద్రపదము:** భూసంబంధమైన వ్యవహారములలో జాగ్రత్త వహించుట మంచిది. ప్రేమ వ్యవహారములు బెడిసికొట్టుట. అనుకోని సమస్యల వలన ఇంట కలహములు. కొన్ని వ్యాపారములు వృద్ధిగా సాగుట. బంధుమిత్రుల కలయిక ఉండగలవు.
**ఆశ్వీయుజము:** వృత్తి ఉద్యోగ వ్యాపారాలలో కొంతఅనుకూలత ఉన్నప్ప టికి వ్యతిరేకుల వలన ఇబ్బందులు ఎదుర్కొనవలసి వస్తుంది. ప్రేమ వ్యవహా రములు ఫలించవు. రాజకీయనాయకులు నూతన పార్టీలో చేరే అవకాశము. స్థిరాస్తుల విషయములో కొంత జాగ్రత్త అవసరము.
**కార్తీకము:** ఆదాయము మెరుగైనప్పటికి వ్యాపారపర ఇబ్బందులు మిమ్ము లను ఇబ్బంది పెట్టవచ్చు. పెద్దవారి ఆరోగ్యము ఆందోళన కలిగించవచ్చు. దైవపరమైన యాత్రలు. ఇంట శుభకార్యక్రమ ఆలోచనలు సిద్ధిస్తాయి.
**మార్గశిరము:** అధికశ్రమచే కొన్ని పనులు పూర్తి అయినప్పటికి బంధు విరోధముచే మనోవిచారము పెరుగును. వ్యాపారరంగములో కొద్దిగా మంచి కనబడును. వివాహాది, గృహ కార్యక్రమములు ముందుకు సాగుతాయి. ప్రయాణ విషయములో తగు జాగ్రత్త వహించుట మంచిది.
**పుష్యము:** మనోవిచారము. ఆర్థికపరమైన ఆటంకములు. పనులయందు వత్తిడి. ఇష్ట స్త్రీ సాంగత్యము. నూతన గృహ విషయమై కొంత ఇబ్బంది. అనుకోని పరిస్థితులలో మాటపడుట. వ్రణరోగములు ఇత్యాది ఫలములు.
**మాఘము:** అస్వస్థతచే దేహం ఇబ్బందిపడుట. గృహములకు సంబంధిం చిన ఇబ్బందులు. వ్యాపార, వృత్తిరంగముల యందు కొంత అభివృద్ధి ఉ న్నప్పటికి ఊహించిన లాభము లేకపోవుట.
**ఫాల్గుణము:** విద్యార్థులకు కొంత కష్టకాలము అయినప్పటికి శ్రద్ధ చూపిన ఉత్తీర్ణత కలుగును. శుభకార్యక్రమ ఆలోచనలు సిద్ధిస్తాయి. ఊహించని సంఘటనలు జరిగినప్పటికి మనోధైర్యముతో ఎదుర్కొనెదరు. దాయాదుల చరస్థిర ఆస్తి విషయములు చర్చకు వస్తాయి.

# ధనూరాశి ఫలితములు



**మూల 1,2,3,4 పూ॥షాడ 1,2,3,4 ఉ॥షాడ 1**
**యే యో భా బి బూ ధా భా ఢా భే**

| **ఆదాయం: 5** | **వ్యయం: 5** | **రాజపూజ్యం: 1** | **అవమానం: 5** |
|---|---|---|---|

గురుడు ఉగాది లగాయితు అక్టోబరు 11 వరకు లాభమందు, తదాది వత్సరాంతం వరకు వ్యయమందు సువర్ణమూర్తి. శని సంవత్సరమంతయు జన్మమ మందు సువర్ణమూర్తి. ఉగాది లగాయితు మార్చి 2019 వరకు రాహువు అష్టమమందు, ద్వితీయ మందు కేతువు లోహమూర్తులు

ఈసంవత్సరం గురుఫలం చూడగా లాభవ్యయమందు మూర్తిమంతము శుభఫలము సూచించుచున్నది. లాభఫలితము చూడగా సుఖభోజనము, గృహలాభము, వ్యయ ఫలితంచే శుభకార్యక్రమములు చేయుట, ధనవ్యయం, ప్రాణము గల వస్తువులను అమ్ముట స్థాన నాశనము సూచించుచున్నది. శని జన్న సంచారముచే మతిభ్రంశము. హృదయవ్యాధి, బంధువైరము, రోగము వలన దుఃఖము ఇటువంటి ఫలితములు ఉన్నప్పటికి మూర్తివంత ముచే కొంత ఉపశాంతి కలదు. రాహువు అష్టమ ప్రభావము వలన శరీరబాధ, నాలుగు కాళ్ళ జంతువు వలన భయము, ప్రభుత్వ అధికారుల వలన సమస్యలు, కేతువు ద్వితీయ సంచారముచే ఐశ్వర్యము, ద్రవ్యలాభము ఉండగలదు. ఈ సంవత్సరము ఈ రాశి వారికి ఏలినాటి శని.

విద్యార్థుల విషయమై చాలా కష్టపడి చదివినప్పటికి ఉత్తీర్ణత సాధించుట కష్టము. వ్యాపారస్తులకు ఈసంవత్సరములో ప్రభుత్వ అధికారుల సమస్యలు, వ్యాపారముల యందు నష్టము ఉండగలవు. సినీ పరిశ్రమ వారికి ప్రోత్సా హము లభిచక తీవ్ర ఇబ్బందులు పడుదురు. పౌల్ట్రీ వ్యాపారులకు అంతంత మాత్రంగా ఉండును. రాజకీయనాయకులకు ప్రజలలో పలుకుబడి తగ్గును.

## మాసవారీ ఫలితములు

**చైత్రము:** శుభాశుభ మిశ్రమ ఫలితములతో కూడికుని ఉన్నది. అనుకోని సమస్యలు కల్గుట. దేహకష్టము. ధనలాభము. శుభమూలక ధనవ్యయము. మానసిక ఒత్తిడి కలిగించును.

**వైశాఖము:** శ్రమకు తగిన ఆదరణ ఉండదు. ద్రవ్య హాని. భయాందోళన, కొన్ని విషయములలో మోసపోవుట. ప్రయాణములందు జాగ్రత్త అవసరం. వృత్తి వ్యవహారాలందు అనుకోని బాధ్యతలు మీదపడే అవకాశమున్నది.

**అధికజ్యేష్ఠము:** మానసిక ఆందళన వెంటాడుతూ ఉన్నప్పటికి శుభకార్య

ప్రయత్నములు సఫలమగును. ఉద్యోగస్తులు పై అధికారుల మన్ననలు పొందగలుగుతారు. కొన్ని వ్యవహారములు ముందుకు సాగుతాయి.
**నిజజ్యేష్ఠము:** కృషి ఉన్నప్పటికి గ్రహచారంచే అనుకొన్న లాభం చేకూరదు. కష్టము అధికమవును. లాభము తక్కువగా ఉండగలదు. ప్రతి పనియందు కొంత భీతి కల్గుగలదు. వివాహాది ప్రయత్నములు ముందుకుసాగ గలవు.
**ఆషాఢము:** కొంత శుభపరిణామాలు కనిపించినప్పటికి కృషితో చిరాకులు ఉండ గలవు. గృహము నందు బాధ్యతలు పెరగటమే కాక ఆరోగ్యము మందగించే అవకాశమున్నది. శ్రమకు తగ్గ ఫలితము రాదు.
**శ్రావణము:** పుత్ర సోదరి వైషమ్యాలు. ఇంట శుభకార్యక్రమ ప్రయత్నములు సఫలమగుట. ప్రేమ వ్యవహారములు అనుకూలించు సూచనలు. వ్యాపారస్తులకు కొంత అనుకూలకాలం. ఉద్యోగులకు బదిలీ అయ్యే అవకాశము.
**భాద్రపదము:** బంధువులచే మాటపట్టింపులు. వృత్తిపరమైన అనుకూలత. ప్రభుత్వ పరమైన లబ్ధి. రిటైల్, హోల్‌సేల్ వ్యాపారస్తులకు కొంత అనుకూలత. స్త్రీ మూలక లాభము. వివాహము కానివారికి వివాహ అనుకూలత.
**ఆశ్వీయుజము:** ఆర్థికపరమైన సమస్యలున్నప్పటికి గౌరవ మర్యాదలకు భంగం వాటిల్లదు. స్త్రీపర సమస్యలు ఉండవచ్చు. శ్రమ అధికమవడంతో కొంత మానసిక వత్తిడి పెరుగగలదు. ఆరోగ్యం కూడా మందగించే ప్రమాదముంది. పెద్దవారి ఆరోగ్య విషయములలో తగుజాగ్రత్త అవసరం.
**కార్తీకము:** శుభకార్యక్రమముల విషయములు యందు చర్చ. దైవపర కార్యక్రమములు, యాత్రలు చేయుదురు. ఉద్యోగస్తులకు ఒత్తిడి తగ్గును. దూరప్రయాణము నందు కొంత అనుకూలతచే ఇబ్బందులు తగ్గును. కాంట్రాక్టు వ్యాపారం చేసేవారికి అనుకొనిన నష్టము వాటిల్లే అవకాశం.
**మార్గశిరము:** బంధువిరోధము. మనవిచారము. వ్యాపార రంగములలో మందకొడి. మిత్రులతో విభేదము. దూరపు బంధువులతో సమాగమనము. ధనవ్యయము. వివాహము కాని వారికి అనుకూల సమయము.
**పుష్యము:** వృత్తి వ్యాపారాలలో అభివృద్ధి కనిపించినప్పటికి ధనవ్యయముచే ఇబ్బంది కలుగవచ్చు. ధైర్యంలోపించుట. శస్త్రచికిత్స జరిగే అవకాశమున్నది. విద్యార్థులకు అనుకూలం. మాసాంతములో ఆదాయము పెరుగగలదు.
**మాఘము:** వివాహ, గృహప్రవేశ శుభకార్యక్రమాలు ముందుకుసాగుతాయి. వ్యాపారంలో దృష్టి సారించిన వృద్ధిరేటుపెరుగును. పూర్వపు ఆస్తుల గురించి బంధుమిత్రులతో వివాదములు ఏర్పడే అవకాశము.
**ఫాల్గుణము:** అనుకోని బాధ్యతలు మీదపడుట వల్ల ఖర్చు పెరుగగలదు. గృహానికి సంబంధించినటువంటి పనులు జాప్యమగును. వర్తకులకు కొంత శుభకాలము. రాజకీయ నాయకులకు కొంత గుర్తింపు లభించగలదు.

